# సుభద్రా పరిణయము.

కూచిమంచి జగ్గకవి ప్రణీతము.




ముద్రింపఁబడ

కొల్లూరి సుబ్రహ్మణ్యము చే

ప్రకటింపఁబడెను.

1935.


 [వెల రు. **0-12-0**

# ఉపోద్ఘాతము.

ఈ సుభద్రాపరిణయమును రచించినవాఁడు కూచిమంచి జగ్గకవి. కౌండిన్యగోత్రోద్భవుఁడు. సుప్రసిద్ధకవిసార్వభౌముఁ డగు తిమ్మకవికి సోదరుఁడు. ఆంధ్రప్రపంచమున నీతనినామమును విననివా రుండరు. వేములవాఁడ భీమకవి, అడిదము సూరన మొదలగువారివలె 'శాపాదపి శరాదపి' గణములోనివాఁడు. తిట్టుకవిత్వమునం దెంతపాండితి గలదో యంతకు వేయిరెట్టులు సొగసుందనము ప్రబంధములయందుఁ జూపఁగల సమర్థుఁడు,

కం. బోట కలాట కిరాట వ
రాట మరాటాంగ వంగ రాజన్యసభా
ఝూట నిరాఘాటనట
చ్చాటుకవిత్వాంకుఁ డరయ జగ్గన ధరణిన్.

అని తిమ్మకవి యీతనిఁగూర్చి చెప్పినపద్యమునం దతిశయోక్తి యించుకయును లేదు. సుభద్రాపరిణయగాథను చేమకూర వేంకటకవి విజయవిలాసమునం దెత్తుకొనియెను. తనకన్నఁ బూర్వుఁ డగుటచేతను, రసచాతురియందు సిద్ధహస్తుఁ డగుటచేతను వేంకటకవియొక్క పోకడలను గొన్నిటి నీతఁ డనుకరింపక తప్పినది కాదు కాని, మొత్తమునకుఁ జాల స్వతంత్రుఁడు. శైలికొఱకీ క్రిందపద్య ముదాహరింపఁబడుచున్నది.

శా. కారం బయ్యె నితంబినీమణి కలంకారంబు రోలంబఝం
కారంబున్ సమదోగ్రకోకిలకుహూకారంబుఁ జంద్రోద్ధతా
కారంబున్ గుసుమాస్త్రచాపగుణటంకారంబు రాయంచక్రేం
కారంబున్ శుకశారికానికరహుంకారంబు ఘోరంబుగన్.

ఈకవి వ్రాసిన జానకీపరిణయముగూడఁ ద్వరలో మాచదువరుల కందఁజేయఁ గల నని మనవి చేయుచున్నాను.

ఇట్లు విధేయుఁడు,

కొల్లూరి సుబ్రహ్మణ్యం.



శ్రీ

# సుభద్రాపరిణయము.

## ప్రథమాశ్వాసము.



శ్రీయలరన్ సుభద్రయును
సీరియుఁ బార్శ్వముల న్నెలంగ న
త్యాయతలీల నీలకుధ
రాగ్రమునందు వసించి నిచ్చలుం
బాయక భక్తకోటి కవపాయశుభంబు లొసంగు శ్రీజగ
న్నాయకదేవదేవుఁ డభిసంవ్యకృపామతి మమ్ముఁ బ్రోవుతన్.

చ. జలజదళాక్షువక్ష మనుసౌధతలంబునఁ గౌస్తుభాతిని
ర్గలసుచిదీప దీప్తులు విరాజిలఁ గాఁపుర ముండి ముజ్జగం
బులు గరుణాకటాక్షమునఁ బ్రోఁచుజగజ్జనయిత్రి లక్ష్మి ని
చ్చలును మదీయగేహమున సంతస మూని వసించుఁగావుతన్. ౨

చ. అగజవివాహవేళఁ దనయాఁదలఁ బొల్చుసుధాంశుమండలం
బెగదిగఁ జూచి పెండ్లికొడు కేమిటికిం దలఁబ్రాలపళ్లె మి
మ్మగధరియించె నంచు నతిముగ్ధతఁ బల్కుభవానినెచ్చెలిం
దగఁ గని నవ్వుశంకరుఁ డుదారత మాకు నభీష్ట మీవుతన్. 3

చ. కరిముఖుఁ గన్నతల్లి శశిఖండవిమండనుకూర్మిరాణి భూ
ధరవరుముద్దుపట్టి నిజదాసగృహాంగణకల్పవల్లి ని

గ్జరనికరప్రపూజిత విరాజితచారుపదారవింద శాం
కరి భువనైకమాత కుతుకంబున మాకు శుభంబు లీవుత౯. ౪

శా. వందారు త్రిదశాధిపప్రముఖదేవవ్రాతమౌళిస్ఫుర
న్మందారద్రుమదివ్యసౌరభమిళన్మంజుప్రసూనాగ్రని
ష్యందన్నవ్యమరందబిందుపరిషిక్తాంఘ్రిద్వయుం డాశ్రితా
నందుం డెప్పుడు మాకు నిచ్చు నతులానందాయురారోగ్యముల్.

క. తెలిలావుపులుఁగు మావులు
గలయులవేలుపులపెద్ద గాదిలికలికిం
బలుకులచిలుకలకొలికిం
దలఁతున్ నాహృదయపీఠిఁ దరలనిభక్తిన్. ౬

చ. ధనదసుహృద్గళాగ్రసముదంచితదివ్యకపాలమాలికల్
గనుఁగొని గొప్పయుండ్రములుగా మది నెంచి కరంబు సావి ది
గ్గన నవి గైకొనం దలఁచి కౌతుకలీల నటించుపార్వతీ
తనయుఁడు విఘ్నరాజు ప్రమదంబున మత్కృతిఁ బ్రోచుఁగావుత౯.

గీ. వామలూరుభవుని వ్యాసు మ్హాఁ గాళి
దాసు మాఘుఁ జోరు దండిఁ బ్రవర
సేను భట్టబాణు శ్రీహర్షు భవభూతి
భారవిని మయూరుఁ బ్రస్తుతింతు. ౭

గీ. నన్నపార్యునిఁ దిక్కయ నాచిరాజు
సోము నమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథునిఁ బోతయప్రాజ్ఞవరుని
శంభుదాసుని భాస్కరు సంస్మరింతు. ౮

ు. కౌండిన్యగోత్రవిఖ్యాతునిఁ గూచిమం
చ్యన్వయాంభోధినీహారకరుని

గంగనమంత్రిశేఖరునకు నంగనా
మణియగు లచ్చమాంబకును సుతుని
బహుకావ్యనిర్మాణబంధురప్రతిభుఁడు
గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌ
రేయుని బుధజనప్రియచరితుని
దేముడురిలింగనారాధ్యదేశికేంద్ర
దత్తమాహేశ్వరాచారవృత్తిరతుని
గందరాడఘనగ్రామమందిరుని మ
దగ్రజుని దిమ్మకవిరాజు నభినుతింతు. ౧౦

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, మహాకవివర్ణనంబును గావించి, యే నొక్క మహాప్రబంధంబు రచియింపం బూని యున్నసమయంబున. ౧౧

సీ. బ్రహ్మహత్యాభీలపాపజీమూతజం
ఝూవాత మేవేల్పు సాధచక్ర
మురుసురాపానోగ్రదురితాంధకారార్క
కిరణ మేదేవుని కేతనంబు
గురుతల్పగమనాఘఘోరశుష్కాటవీ
దవవహ్ని యేప్రభుదర్శనంబు
కనకాపహరణదుష్కలుషపర్వతమహా
శని యేవిభుని సుప్రసాదకణము
వివితతత్సహావాసాదివృజనకలభ
పంచముఖసింహ మేస్వామిపావతీర్థ
మట్టిపురుషోత్తమోత్తమ పట్టణాని
నాయకుం డైన శ్రీజగన్నాయకుండు. ౧౨

కం. ఒకనాఁడు నాకుఁ గలలోఁ
ప్రకటకృపాస్వాంతుఁ డగుచుఁ బ్రత్యక్షం బై
నికటమున నిల్చి మెల్లన
నకుటిలగతి నిట్టు లనుచు నానతి యిచ్చెన్. ౧౩

గీ. వత్స వినుము నీవు నా పేరివాఁడ వగుట
నీకు భద్రంబు లిడ వచ్చి నిలిచినాఁడ
పొసఁగ నిహపరసౌఖ్యంబు లొసఁగువాఁడ
నిందు వేడుక మదిఁ బూని యుండికొనుము. ౧౪

కం. వెర వొప్పార సుభద్రా
పరిణయ మొనరించి మాకు భక్తి దలిర్పన్
దిరముగఁ గృతి గావింపుము
సరసయశస్సాంద్ర జగ్గసత్కవిచంద్రా. ౧౫

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుం డంతర్హితుం డైన నేను నత్యంత
సంతుష్టాంతరంగుండ నై. ౧౬

## —• షష్ఠ్యంతములు. •—

కం. భద్రగజరక్షణునకు సు
భద్రావదనాంబుజాతభాస్కరునకు ని
ర్నిద్రప్రభావునకు బల
భద్రసమేతునకు విహగపతికేతునకున్. ౧౭

కం. ఇంద్రద్యుమ్నసరస్తట
సాంద్రవిహారానుమోదసదమలమతికిన్
జంద్రార్కనయనునకు ని
స్తంద్రకృపాసింధునకును జనబంధునకున్. ౧౮

క. నిరవద్యచరిత పావన
బిరుదాంకునకున్ సమస్తబృందారక కి
న్నర గరుడ యక్ష పక్షి ఖే
చర విద్యాధరకదంబసంసేవ్యునకున్. ౧౯

క. హరిహయముఖనిఖిలామర
వరమకుటవిఘటితదివ్యవనరుహరాగో
త్కరరుచినీరాజితమృదు
చరణసరోజునకు భానుసమతేజునకున్. ౨౦

క. శక్రోపలనిభగాత్రున
కక్రూరజనావనక్రియాసూత్రునకున్
నక్రాపహరణకారణ
చక్రాయుధసహితపాణిశతపత్రునకున్. ౨౧

క. శతధృతినతచరణునకున్
దితిసుతకులహరణునకుసుధీరక్షణవి
శ్రుతకరుణాభరణునకున్
నతజనశరణునకు నీలనగశరణునకున్. ౨౨

వ. సమర్పణంబుగా నారచియింపం బూనిన సుభద్రాపరిణయం బను
శృంగారరస ప్రబంధంబునకుం గథాభిధానం బెట్టి దనిన. ౨౩

క. శ్రీకరమై మునిలోకవ
శీకరమై జగదతీతచిరతరబహుపు
ణ్యాకరమై నైమిశమను
ప్రాకటగహనస్థలంబు పరఁగు ధరిత్రిన్. ౨౪

క. ఘనులవ్వని శౌనకముఖ
మునివరు లత్యంతమోదమునఁ బుణ్యకథల్

వినుమండి రోమహర్షణ
తనయుని గని యనిరి వినయతత్పరు లగుచున్. ౨౫

గీ. మునివరేణ్య నరుఁడు మునుసుభద్రాసతీ
మణిని బెండ్లి యైన మహితచరితఁ
దెలుపవలయు మాకు దృఢమతి నన నాతఁ
డెలమి వారికిట్లు దెలుపఁ దొడఁగె. ౨౬

మ. వెలయున్ సర్వపురాగ్రరాజములలో విఖ్యాతమై యొక్కప్రోల్
బలభిద్రత్నవినూత్నకాంచనకనత్ప్రాసాదకేళీకళా
కలనాకౌశలకామినీముకురశంకాకారి రాకానిశో
త్పలసద్బాంధవమండలం బవని నింద్రప్రస్థనామంబునన్ ౨౭

క. ఆపుర మురువై భవజిత
గోపురము మణీనిబద్ధగోపుర మలకున్
నాపురము కలిమి చేడియ
కాఁపుర మున్నట్టి నెలవు గణుతి యొనర్పన్. ౨౮

మ. తొలివరాట్టాలకడాని మేడల తుదిం దోరంబుగా నాడు రా
నవలామిన్నలు మిన్నుగేళకుళిలో నాళీకనాళచ్ఛటల్
తివు రొప్పారఁగఁ గోసి మేపుదురు హాళిం గేళిహంసాళికిన్
భువనాతీతవిచిత్రవైభవములం బొల్పారు నవ్వీడునన్. ౨౯

చ. మొలకవసంతజీవనము లెత్తపుమేడలయందుఁ బ్రోఁడలై
కులుకుచు రాస్మనాయకులఁ గూడి శ్రమంపడి యున్న పిన్నరా
చెలువల గుబ్బచన్గవలఁ జిప్పిలు చెమ్మట లార్చు స్వర్ధునీ
జలజసుగంధగంధిలవిశంకటమందరగంధవాహముల్. 30

చ. మెఱుఁగుకడాని బంగరపు మేడల రేల్విహరించు చేడియల్
బిఱబిఱఁ జెంత నున్న శశిబింబము గాంచి నిజాస్యలక్ష్మి ని

త్తటి హరియింపఁ డాకొనినతస్కరుఁ డంచును ముష్టిఁ బట్టినన్
వాటిమాటి జేయఁ జంద్రునకు మచ్చ ఘటిల్లెను నాఁటినుండియున్.

సీ. మదగజంబులు సానుమద్వ్రజంబులు గాఁగ
విమలాశ్వములు తరంగములు గాఁగ
జనపరంపర జలజంతుసంతతి గాఁగ
లలనలు విద్రుమలతలు గాఁగ
సౌవర్ణసౌధముల్ సైకతంబులు గాఁగ
దేవతాభవనముల్ ద్వీపములుగఁ
తూర్యనాదములు నిస్తులఘోషములు గాఁగ
నీలభిత్తికలు శైవాలములుగ
హీరసోపానపంక్తు లహీనఫేన
పుంజములు గాఁగఁ ద్రిభువనాద్భుతసమగ్ర
వైభవంబున ననయంబు నలరు వారి
రాశిచందంబు పూని యారాజధాని. 32

ఉ. హాటకదివ్యరత్నఘటితాన్నతమై దివితోడ రాయు బ
ల్కోటవెసంగఁ గొత్తడవుఁ గొమ్మల నిమ్మల విశ్రమించుచు మి
న్నేటితరంగమాలికల నీఁదుచుఁ గ్రీడలు సేయుఖేచర
పాటలగంధు లాయుచిరపట్టణరాజమునం దజస్రమున్. 33

సీ. అంభోధిశయనుబాహాంతరంబును బోలెఁ
బ్రతిదినకమలాధివాస మగుచు
నమరావతీపట్టణాధిరాజము బోలె
ననిమిషసంచారహారి యగుచు
వసుమహీయుతముఖ్యస్తనభాగమును బోలె
మకరికావిభ్రాజమాన మగుచు

విపులదాననిరూఢ స్వపసభాస్థలిఁ బోలె
కవిరాజసద్వచఃకాంత మగుచు
భూరిదిజ్మండలముఁ బోలె పుండరీక
కుముదరంభాసమానమై కమలభవుని
సదనమును బోలెఁ బరమహంసవ్రజాభి
రామమై ప్రోలి క్షేమాంబురాశి దనరు. ౩౫

శా. జంభారాతికరాగ్ర జాగ్రదురువజ్రక్రూరధారాహతిన్
స్తంభీభూతములైన భూమిధరముల్ సన్యాక్ష్మపోసిస్థచే
నంభోజాసను వేఁడి వజ్రకునభూషావాప్తి నత్యుజ్వల
త్కుంభీంద్రాకృతు లూని తత్పురసరేంద్రుం గొల్వఁ బోలుం జుమీ.

క. అయ్యారే పురిపార్శ్వము
లొయ్యారం బెనయ ఖురపుటోద్ధపరాగం
బయ్యనుఘోటకములపైఁ
గయ్యానకుఁ గాలు దువ్వుకరణిఁ జెల్లున్. ౩౬

గీ. సభలఁ దనరాణి ప్రోడమై సంచరించి
తనకుఁ బాగడిక దెచ్చెఁ గా కేరసి చూడ
జలజసంభవుఁ డేపాటిచదువుకాఁడ
టంచుఁ దెగడుదు రప్పురియగ్రభవులు. ౩౭

క. సర్వజ్ఞశిఖామణు లరి
గర్వవిదూరులు తమోవిఖండనులు కళా
ధూర్వహులు వసుసమన్వితు
లుర్విజను లలర రాజు లొప్పుదురు పురిన్. ౩౮

గీ. ధనము బుధులకు నిడి పేరు గనిన మేము
ధనదులము గాక యొకమూఁ దనధనంబు

దాఁచుకొనెను కుబేరుఁ డేఘనదుఁ డంచుఁ
గేరుదురు మాటి కప్పిటియూరుభవులు. ౩౯

మ. హాల మేప్రొద్దు భుజాగ్రసీరమునఁ గాయల్ గాయఁగా మోఁచి యు
త్కాలికం బ్రదిమ్మరుఁ గాని కానిపొలముం దా దున్ని పండించెనే
మొలకుం దెల్లఁబట్ట గానమ యుసీ ముప్ప్రొద్దుఁ గల్ ద్రావునా
హాలి యంచు న్నిరసింతు రందు నయభాగ్యాకర్షకుల్ కర్షకుల్. ౪౦

గీ. కమలరాగాధరలు నీలకచలు హీర
రదలు మౌక్తికనఖరలు రమ్యవిద్రు
మాంఘ్రులు సువర్ణవిగ్రహ లచటివార
సతులు మణిమయకాంచనప్రతిమ లౌర. ౪౧

సీ. తమనెమ్మొగముల చెల్వము గను నివి యను
సరణిఁ గమ్మనితమ్మివిరు లొసంగి
తమవాలుఁజూపులందము వూను నివి యను
కరణిఁ జక్కనినల్లగల్వ లొసఁగి
తమవాతెఱలసొంపు దాలుచు నివి యను
జాడ నాడెంపుదాసనము లొసఁగి
తమదంతపంక్తిచందము జెందు నివి యను
పోలుపునఁ గుందకుట్మలము లొసఁగి
తమనఖరనాభినాసాపదములకొమరు
గాంచు నివి యనుక్రియఁ గేతకములుఁ బొన్న
పువులుఁ జంపకములును జెందొవలు నొసఁగి
ఇటుల నలరింత్రు పుష్పలావికలు వీట. ౪౨

సీ. తమమొగంబులు సరోజము లంచుఁ జేరి నా
సలు చంపకము లంచు జరగుతేంట్లఁ

దమ కెంబెదవులు బింబము లంచుఁ జేరి సై
సాంకవంబున కుల్కి చనుశుకములఁ
దమరోమలతలు నాగము లంచుఁ జేరి క
న్బొమలు విండ్లని పాఱు నెమలిగములఁ
దమకరంబులు పల్లవము లంచుఁ జేరి కొ
ప్పులు మొగుళ్లని యోసరిలు పికములఁ
గాంచి కిల కిల నవ్వుచుఁ గనకకంక
ణారవంబులు చెలఁగ బిట్టార్చి పులుఁగు
మొత్తములఁ దోలుదురు పాంథచిత్తములు చ
లింప నాప్రోల శాలిపాలికలు లీల. ౨౩

క. ఆనగర మేలు మేలుగ
మానితకీర్తిప్రతాపమహిమోన్నతుఁ డై
దీనజనావనరతుఁ డై
దానకళామహితుఁ డగుచు ధర్మజుఁ డెలమిన్. ౨౪

సీ. సర్వసర్వంసహాధూర్వహత్వాదృత
కరి కిరి హరి గిరి కచ్ఛపుండు
బహుకులాచలశిలాఫలకాగ్రభాగవి
నిక్షిప్తజయశాసనాఙ్కురుండు
తతనిరంతరదానధారాప్రవాహాని
శప్రపూరితసప్తసాగరుండు
చండభండనసముద్దండవిక్రమకళా
ఖండితాహితరాజమండలుండు
చైత్రయాత్రావసరవినిస్తంద్రరణద
ఖండభేరీధణంధణత్కారఘోర

వీరకాహళకారావశిచలితాష్ట
హరిదిభేంద్రుండు పాండవేయాగ్రజుండు. ౪౫

సీ. కువలయావనకళాకుశలుఁ డింతియ కాని
విహరింపఁ జక్రవిద్వేషి గాఁడు
సతతసన్మార్గసంచారి యింతియ కాని
రూపింప దోషాకరుండు గాఁడు
బుధజనప్రియకరాభ్యుదయుఁ డింతియ కాని
శోధింప గురువిపక్షుండు గాఁడు
వర్ణితపరిశుద్ధవర్ణుఁ డింతియ కాని
గణుతింప మలినలక్షణుఁడు గాఁడు
భళిర యాతఁడు రాజు గాకిల నొకండు
రాజగుట కెట్లు దగునని రహిని సుకవి
రాజులును రాజులును బుధరాజు లెన్న
రాజిలెడుఁ దివి నాధర్మరాజు దనరు. ౪౬

సీ. చెవిచెంతఁ గ్రూరద్విజిహ్వకోటులఁ గూర్చి
బ్రహ్మహింసనబుద్ధిఁ బ్రబలఁడేని
దుర్వర్ణభూమిభృత్కూటంబులను గూడి
యుగ్రుఁడై ప్రజఁ గ్రుంపకుండెనేని
పఱమువాహిని గూడి పౌరుషం బఱచెసి
తిప్పలఁ బడి తూలి తిరుగఁడేని
విసము కత్తుకఁ బట్టి వేడిచూపోదవంగ
ధర్మవిఘాతియై తనరఁడేని
యభవునకు రాజశేఖరుఁ డనెడు పేరు
తగుఁ గదె యటంచుఁ గవిబుధోత్తములు సారెఁ

దనమహారాజశేఖరత్వము గణింపఁ
దనరెఁ జిరభోగసురరాజు ధర్మరాజు. ౪౭

గీ. ప్రాణికోటుల దండించు బాళి యెఱుఁగఁ
జెపుడు మారకు లగుబంట్ల నేలఁబోఁడు
గురుగదాన్వితుఁ డై మూల గుంటుపడఁడు
నిర్మలాచారశీలుఁ డాధర్మరాజు. ౪౮

గీ. ఆమహీపాలమౌళికి భీమ విజయ
నకుల సహదేవు లనఁగ నున్నతబలాఢ్యు
లఖిలబుధబంధురక్షణోపాయవిదులు
నలువు రనుజన్మ లశ్రాంతనయులు గలరు. ౪౯

క. ఆనలువురుతమ్ములుఁ దన
యానతి దప్పక సమస్తహరిదంతధరి
త్రీనాథసమితి గెలిచి య
హీనపదార్థములు దెచ్చి యియ్యఁగ నెమ్మిన్. ౫౦

సీ. హరిప్రభాపూరహీరసోపానంబు
నీలజాలకజాలలాలితంబు
వైదూర్యవిరచితవలభికానికరంబు
విద్రుమస్తంభప్రవిస్తరంబు
ఘనతరపుష్యరాగద్వారబంధంబు
గోమేధికావృతకుట్టిమంబు
విమలగారుత్మతవేదికారుచిరంబు
పద్మరాగకవాటబంధురంబు
స్వచ్ఛముక్తాఫలచ్ఛటాచ్ఛాదనంబు
నగుచు వెలుఁగు సభాగృహాభ్యంతరమున

సకలబుధబాంధవ మాహాత్మ్యసహితుఁ డగుచుఁ
గడఁక నొకనాఁడు పేరోలగమున నుండి. ౫౧

గీ. తనపురోహితుఁ డైన ధౌమ్యునియనుంగు
ననుజుఁ గొమరుని సకలవిద్యావిశార
దుని విశారదు వీక్షించి యనుపమాన
మృదుమధురవాక్సుధాధార లొదవఁ బలికె. ౫౨

క. ధరణీసుర ద్వారకపురి
కరిగి జనార్దనుని గాంచి యఁదటిసేమం
బరసి నిరాతంకగతిన్
సరగున రమ్మనుము సెలవొసఁగినయంతన్. ౫౩

మ. చని యాభూమిబుధుండు గాంచె నెదురన్ సంప్రీతచేతస్కుఁ డై
ఘనగంభీరజలాంతరాళచలదుగ్రగ్రాహనక్రోడమున్
ఖనటద్భ్రాంతిఘూర్ణితఘోరవలత్కల్లోలనిర్నిద్రమున్
జనహృద్వ్యాపరదిక్సముద్రము నరిత్సంయోగనిశ్చిద్రమున్. ౫౪

సీ. ఘనుల కపారజీవన మొసంగెడుదాత
మర్యాద దప్పని మానఘనుఁడు
బహుతరకవిరాజపాలనశీలుండు
సతతమహోన్నతచక్రవర్తి
యుసమహీభృత్కోటి కునికిపట్టగుమేటి
మణికంకణోత్కరకామానితుండు
వర్ధమానానంతవాహినీసహితుండు
భువనాభిరామవిస్ఫురితకీర్తి
యారసాధీశ్వరుం డాత్మ నెన్న బాడ
బాశ్రయుం డగు టెమిచోద్యం బటంచు

నెంచుచు ధరామరోత్తముం డేగి భవ్య
సరణి నల్లన ద్వారకాపురము జేరె. ౫౫

సీ. వలపుగొజ్జఁగినీటిసెలయేటిగమి దాఁటి
ఘనసారకదళికాననులు గడచి
చలువచెంగలువబావులఁ గేవ విహరించి
దాకఁజందిరిచాల్పొదరుల నిలిచి
బలితంపునెత్తమ్మికొలఁకులకడ డాసి
పొదలుక్రొవ్విరిమల్లెపొదలు దరిసి
గుజ్జుతేమావిమ్రాఁకులనీడ వసియించి
గున్నసంపెగతోఁటగుంపు లొరసి
పారిజాతమహాపాదపచ్ఛటాని
రంతరోద్యానవాటికాభ్యంతరేందు
కాంతమణిపీఠికాగ్రభాగముల మెలఁగి
ద్వారకాపురఘంటాపథమునఁ జనుచు. ౫౬

సీ. కనకనిర్మితశతాంగములు నిరీక్షించి
యల మేరుశిఖరంబు లని తలంచు
మత్తద్విరదరాజమండలంబులు చూచి
యంజనాహార్యంబు లనుచు నెంచుఁ
జంద్రకాంతోపలసౌధముల్ గనుఁగొని
హారగిరికూటంబు లని గణించు
బహుళసమున్నతప్రాకారములు గాంచి
ఘనచక్రవాళాద్రు లనుచు నెన్ను
దివ్యమాణిక్యదీప్తిదేదీప్యమాన
దేవతాగారగోపురాదికము లరసి

రోహణత్వాన్మధరము లని యూహ సేయఁ
బ్రవిమలానందహృదయుఁడై బ్రాహ్మణుండు. ౫౭

గీ. అల్లు పురవీథిఁ జని మురహరునినగరు
చొచ్చి మొగసాల నిల్చి యచ్చోట నొక్క-
చాయ నీక్షించి తనరాక శౌరి కెఱుఁగఁ
జెప్పు మని పంప నతఁ డేఁగ నప్పు డవల. ౫౮

సీ. బహురత్నదీపప్రభాభాసమానంబు
కనకపంజరశారికాశుకంబు
పటుతరరతిబంధబంధురప్రతిమంబు
గోమేధికోజ్జ్వలత్కుట్టిమంబు
ధళధళత్కాంతినిర్మలతరాదర్శంబు
కస్తూరికాగంధగంధిలంబు
ఘనపీఠికాపేటికాజాలరమ్యంబు
హిమవారిపూరితహేమకలశ
మతులసౌరభ్యసంవాసితాభ్రపారి
జాతభూజాతకుసుమసంఘాతరచిత
హారిశృంగారమహితశయ్యాతలంబు
నగుచు సొగ సీను కేళీగృహాంతరమున. ౫౯

చ. జిగిబిగిపట్టుపట్టె నునుజీవితలాడయుఁ బ్రక్కదిండ్లు సొం
పగువిరిపాన్పు పూసురటి యాకుమడుంగు లొసంగుచుం గడున్
సొగసులు గుల్కుకుందనపుసూత్రపుబొమ్మలు గ్రాలు లీల మే
ల్పగడపుఁగోళ్ల దోమతెరబంగరుమంచముమీఁద వేడుకన్. ౬౦

సీ. కనకకంకణఝణత్కారంబు వెలయంగ
భోజకన్యక పదాంబుజము లొత్త

సిద్ధంపు తెలిమించు టద్దంబు కైఁబూని
నిలిచి పాత్రాకృతి నీడ చూపఁ
చరణమంజీరనిస్వనములు చెలఁగ జాం
బవతి మాణిక్యచామరము వీవ
బెడఁగు క్రొందెలి యాకుమడుపులు గొని మిత్ర
వింద సన్నపుగందపు విడెమొసంగ
లీల భద్ర సుదంత కాళింది లక్ష్
ణాయు ను మొదలగు వరపద్మనయన లూడి
గములు గావింప సుఖగోష్ఠిఁ గాలుచుండెఁ
బృథుయశఃస్ఫూర్తి గోపాలకృష్ణమూర్తి. ౬

గీ. అప్పుడు చారుఁడు హరిచెంత కరిగి మ్రొక్కి
దేవ పాండవు లనుప భూదేవుఁ డొకఁడు
వచ్చి మిము దర్శనము సేయ నిచ్చఁ గోరి
యోర్మి దనరార మొగసాల నున్నవాఁడు. ౬

క. అని విన్నవించుటయు న
ప్పనజదళేక్షణుఁడు శయ్యాస్థలము డిగి స
య్యన భూసురవరు చెంతకుఁ
జని వినయం బెనయ మ్రొక్కి సరసత మీఱన్. ౬

ఉ. ఆమహినిర్జరాన్వయసుధార్ణవపూర్ణవిభావరీచరున్
బ్రేమ మెలర్పఁ దోడుకొని పెంపలరం దనదివ్యకేళికా
ధామము సొచ్చి యచ్చట నితాంతహరిన్మణిభద్రపీఠికం
దామరసాయతాక్షుఁడు ముదంబున నిల్పి సపర్య లిచ్చుచున్. ౬

క. ఇవ్విధి వర పాండుసుతు లిం
ద్రప్రస్థపురంబునందుఁ బ్రాభవలీలన్

సుప్రీతి నున్నవారలె
క్షిప్రంబున మాకుఁ దెలియఁ జెప్పఁగవలయున్. ౬౫

ఉ. సేమమె ప్రాజ్ఞగాస్తనగసేతుహిమాచలమధ్యభాగభా
గ్భూమితలేంద్రమస్తకవిభూషణదివ్యసరోజరాగర
త్నామలదీప్తిదీపితపదాంబురుహాభిగతాభిమాతికిన్
సామజఘోటకప్రముఖసాంద్రవిభూతికి ధర్మసూతికిన్. ౬౬

క. సామజహయరథభటము
ఖ్యామితచతురంగబలసమన్వితరిపురా
డ్భీమునకున్ భీమునకున్
సేమంబు గదయ్య విప్రశేఖర చెప్పుమా. ౬౭

క. దుర్జనరిపురాడ్భయదమ
హార్జితవిక్రముఁడు నృపజనోత్తముఁడు నయో
పార్జితవిమలయశుం డ
య్యర్జునునకుఁ గుశలమే ధరామరవర్యా. ౬౮

క. కులకుధరసదృశధృతిభా
క్కులకు మహాశిశిరకిరణకులజలధిశశాం
కులకుఁ బ్రతాపార్కులకు న
కులసహదేవులకు మిగులఁ గుశలంబు గదా. ౬౯

క. కాంతాజనరత్నము ల
శ్రాంతమహాధర్మమతులు జననుతచరితల్
కుంతీద్రుపదతనూజలు
సంతసమున నున్నవారె జగతీదివిజా. ౭౦

గీ. నావుడు విశారదుఁడు వల్కె నలిననయన
తావకీనకటాక్షవీక్షావిశేష

మహిమ నచ్చోట వారు సేమమున నుండి
మిమ్ము నరయంగ నిటకుఁ బంపించినారు. ౨౧

క. నీవనితలకును నీకున్
రేవతికిని హాలికి రోహిణికి దేవకికిం
బావనగుణుఁ డగు నవ్వసు
దేవునకున్ భావుకంబె త్రిదశేంద్రనుతా. ౨౨

ఆ. నారదాదిమౌనినాయకుల్ గనలేని
నిన్నుఁ జూడఁగంటి నేఁడు సకల
పాపములు నశించె భాగ్యరేఖ లభించె
సంతసించె మది యనంతరూప. ౨౩

క. నీమహిమ మెన్నఁ దరమె వి
ధామహసుత్రామశైలతనయాధిపము
ఖ్యామరవరులకు నైనం
దామరసదళాయతాక్ష దనుజవిపక్షా. ౨౪

అని మఱియు నిట్లని వినుతింపం దొడంగె. ౨౫

గద్య. జయ రమాకుచకుంభకుంకుమసాంకవాంకితనిజభుజాంతర
భయదవక్రనిరుద్ధయూథపపాలనాతికృపానిరంతర
నందగోపకుమార సనకసనందనాదిమునీంద్రపూజిత
మందరోద్ధరణైకకారణ మాననీయ యశోవిరాజిత
భోజకన్యావిమలహృదయాంభోజమత్తమిళిందనాయక
రాజమానమహాతపోధనరాజశశ్వదభీష్టదాయక
రాధికామధురాధరామృతరసధురీపరిపానకౌశల
సాధుసజ్జనసముదయావనసారకరుణాపూరపేశల
భానుకోటివిభావిభాసిత భవ్యకౌస్తుభమణివిభూషణ

ధేనుకాసురదర్పహరణ సుధీజనప్రియ మృదులభాషణ
సతతవితతపిచండమండిత సరసిజాతభవాండమండల
అతులపంకజరాగమణిమయహారినూతనమకరకుండల
మకరకేతనదర్పణప్రతిమానమానితమృదుకపోలక
వికటశకటఖరాదికాసురవీరఘోరవిస్మయవిభాళక
వల్లవీపరిరంభసంభ్రమవర్ధమానసమగ్రకౌతుక
మల్లయుద్ధకళావిజృంభణ మథితచాణూరాదిఘాతుక
లోకనాయక సత్యభామాలోల నీలాహృదయరంజన
భీకరాహవరంగరంగత్పృథుబలాన్విత రిపువిభంజన
నిరుపమానవిహారనవనవనీతచౌర్యకళావిశారద
హరిహయాశ్మవిభానిభాకలితాంగరుగ్జితనీలనీరద
మదనకోటివిలాసభాసుర మాలినీమృదుహృదయతస్కర
త్రిదశపరివృఢవిభవ జాంబవతీసతీవదనాబ్జభాస్కర
కాళియాహిఫణోపరిస్థల కల్పితానమలాస్యఖేలన
నీలపరిధానప్రియానుజనిత్యసజ్జన భక్తపాలన
దేవ దేవ మహేశ కేశవ దేవకీవసుదేవనందన
పావనాంగవిలిప్త దివ్యజవాదికామృగనాభిచందన
దివ్యపరిమళమిళితయమునాతీరనీపవనప్రచారణ
భవ్యనిజచరణాబ్జసేవకపటలనమస్కృతభయనివారణ
వాసుదేవ ముకుంద మాధవ వరద నారాయణ జనార్దన
వాసవార్చిత కృష్ణ మురహర వనజనాభ సురారిమర్దన
ధరణిధరధర విపులబాహాంతర నిరంతరవిలసదిందిర
తరణిహిమకరనయన దామోదర మహావైకుంఠమందిర. ౭౬

వ. అని వినుతించి వెండియు నిట్లనియె. ౭౭

గీ. దానవాంతక వినుము నీమేనమఱఁది
యర్జునుఁడు మిమ్ము దర్శింప నాత్మఁ గోరి
యొరిమె నువ్విళు లూరుచు నున్నవాఁడు
వచ్చు నతఁ డింతలోన నీవంక కెలమి. ౨౮

క. గోత్రారిముద్దుకొమరుఁడు
శత్రునిషూదనుఁ డపారసౌందర్యకళా
గాత్రుఁడు మీకృప కాతఁడు
పాత్రుండు గదయ్య పరమపావనచరిత్రా. ౨౯

క. నరనారాయణు లనుముని
వరు లిపు డర్జునుఁడు నీవు వసుధాతలముం
బరిపాలించుటకొఱకీ
కరణిం బ్రభవించినారు కద యదుతిలకా. ౩౦

గీ. అనిన సంతసిల్లి హరి యమ్మహీసుర
వరున కమితదివ్యవసనకనక
మణివిభూషణాది మహితసువస్తువుల్
చాల నొసఁగి సెల వొసంగుటయును. ౩౧

క. ముప్పిరి గొనుకౌతుకమున
నుప్పొంగుచు ధారణీసురోత్తముఁ డచటన్
గుప్పున దరలి సుఖోన్నతి
దప్పక తనమొదలిరాజధానికిఁ జనియెన్. ౩౨

వ. చని తనరాక కెదురు చూచుచున్న ధర్మరాజుం బొడఁగాంచి యి
ట్లనియె. ౩౩

క. మనుజేంద్ర నీదుపంపునఁ
బనిపూని రయంబ ద్వారవతి కేగి ముదం

బున నం బోకదిక్యనికే
తనమున శృంగారలీలఁ దళుకొత్తంగన్. ౬౬

సీ. అలతిచెందొగవిందునందుఁ గందును బోలె
నొసల కస్తురిరేక పసఁ బొసంగఁ
జటిమొగిల్ తెగయందు మెఱుఁగుదీఁగెయుఁ బోలి
మేన బంగరుశాలు మెఱుఁగులీన
తొలిమలతుదయందు సలినబంధుఁడు వోలెఁ
దల మలిమకుటంబు చెలువుమీఱ
రత్నవేదికయందు రంగవల్లులు వోలె
నెన ముత్తియపుఁబేరు లెమ్మె నెఱప
కటకకంకణముద్రికాకనకకుండ
లాద్యలంకారములు తద్ద హారువు చూప
సత్యభామాదిపట్టంపుసతులఁ గూడి
యొఱపు రాణింప శుభలీల నున్నవాని. ౬౭

సీ. తెలిదమ్మిఱేకులఁ దెగడుకన్నులవానిఁ
దొగవిందు నగు ముద్దుమొగమువాని
మించుటద్దము మించు మెఱుఁగుఁజెక్కులవానిఁ
గొదమతేఁటుల గిబ్బుకురులవాని
చిగురుటాకులఁ బోలు చేయిదమ్ములవాని
గుసుకవాటము గేరు నురమువాని
గజతుండముల నెన్ను భుజదండములవాని
బింబోపమానాధరంబువాని
నవ్యచంపకముకులాభనాసవాని
కంబునీకాశరుచిరగళంబువాని

హరిహయశిలాకలాపదేహంబువాని
భావజవిలాసు శ్రీకృష్ణదేవుఁ గాంచి. ౮౬

వ. అట్లు గనుఁగొని సముచితప్రకారంబున. ౮౭

గీ. ఎలమి నతనికి మీసేమ మెఱుఁగఁజెప్పి
యతనిసేమంబు దిటముగ నరసి దివ్య
వసనమణిభూషణాదు లవ్వనజనాభు
చేతఁ గొనివచ్చినాఁడ మీచెంత కిపుడు. ౮౮

క. ఓతేఁడ వినుము నెయ్యము
మీఱఁగ నయ్యదుకులేభుండు మీసేమము నే
మాఱు వెదఁదగ నడుగుచు
వేఱొండుతలంపు లేక వినియెం జుమ్మా. ౮౯

గీ. అనిన నుత్సహించి యానృపాలాగ్రణి
యతని గారవించి యనుచుటయు ర
యంబ యద్ధరామరాగ్రగణ్యుఁడు దన
సదనమునకు సంతసమునఁ జనియె. ౯౦

వ. అని శౌనకాదిమహర్షులకు రోమహర్షణి యెఱింగించిన వార లతని
నవ్వలికథావిధానం బెట్లని యడుగుటయును. ౯౧

మ. యమునాతీరనికుంజసంజవననిత్యానంద కృద్రాధికా
రమణీపీనపయోధరద్వయపరీరంభప్రసక్తాభ కుం
కుమపాటీరమృగీమదోల్లసితవక్షోభాగ దాక్షాయణీ
రమణాంభోజభవామరేంద్రవినుతప్రాజ్య ప్రభావోదయా. ౯౨

క. అరిపృతనాసమవర్తి
సురసముదయచక్రవర్తి సుగుణస్ఫూర్తి

శరదంబుదనిభకీర్తీ
పరిహృతభువనార్తీ పతితపావనమూర్తీ. ౯౩

**మాలిని.** సజలజలదనీలా శాతకుంభోరుచేలా
త్రిజగదవనశీలా దీనమందారసాలా
కుజనకులవిభాళా గోపికాకేళిలోలా
వృజినహరణమూలా వేణుగానైకలీలా. ౯౪

గద్య. ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపాసిరీక్షణాసంలబ్ధ సారకవితావిచిత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలవిద్వజ్జనవిధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబైన సుభద్రాపరిణయం బను శృంగారరసప్రబంధంబునందు బ్రథమాశ్వాసము.



శ్రీ

# సుభద్రాపరిణయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీమత్పురుషోత్తమ పుర
ధామ సమిద్ధ్యమ దనుజదర్ప విరామా
ధీమజ్జననుతసుగుణో
ద్దామ జగన్నాథనామ దైవలలామా. ౧

వ. అవధరింపుము శౌనకాదిమహాత్ములకు రోమహర్షణి యిట్లని చెప్పం దొడంగె నట్లు విశారదుండు ధర్మరాజుచేత ననుజ్ఞాతుండై తత్గృహంబున కరిగి మఱునాఁడు సవ్యసాచికడకుం జని మంతనంబున నతనితో నిట్లనియె. ౨

గీ. పార్థ ధర్మజుండు పనుప ద్వారక కేగి
భూరితేజుఁ డైన శౌరిఁ గాంచి
వారిసేమ మెల్ల నారసి పిదప మీ
సేమ మెల్ల నెఱుఁగఁ జెప్పుటయును. ౩

వ. అమ్మహాప్రభుండు మందానందకందళితహృదయారవిందుండై యనేక ధనకనకమణిభూషణాంబరాదికంబులు నాకొసంగి పుత్తెంచిన వచ్చి ధర్మరాజున కాకుశలవృత్తాంతం బెఱింగించితి నింక నొక్కవిశేషం బెఱింగించెద నాకర్ణింపుము. ౪

క. ఆకృష్ణప్రభుసోదరి
రాకామిహికాకరాభిరామానన భూ
లోకాతీతగుణాన్విత
ప్రాకటరుచి నలరుఁ గద సుభద్ర యనంగన్. ౫

క. రాజకులతిలక వినుమా
రాజముఖిమణిని బొగడ రా దింతయు నా
రాజీవభవుల కైనను
రాజీవభవునకు నైన రాజసలీలన్. ౬

సీ. చిలుకలకొల్కి ముద్దులగుమ్మ వ
న్నెలగని యపరంజిబంగరుసలాక
తలిరుజొంపపుమావి వలిగప్పురపుదిమ్మ
తులుకుమిటారి రంగులకొటారు
వలపుగస్తురిలప్ప తొలుకరిక్రొమ్మించు
కమ్మగొజ్జఁగబంతి తమ్మికొలను
తళుకువజ్రపుబొమ్మ తెలిముత్తియపుగోవ
పగడపుదీవ సోయగపువాఁక
కడిఁదివెన్నెలనిగ్గు చెంగలువబావి
చికిలిక్రొమ్మించుటద్దంబు పికిలిచెండు
నాగ నలరారు నయ్యెలనాఁగబాగు
పొగడ నలవియె వేనోళ్ళప్రోడ కైన. ౭

ఉ. దాని ఘనాఘనద్యుతివితానసదృక్కబరీమరీచికిన్
దాని ధళత్తళత్తనులతాలితతాభినుతప్రభాళికిన్
దాని ధగద్ధగద్రుచినితాంతవిరాజకపోలపాలికిన్
మానవనాథ యెట్టిదృఢమానసు లైనఁ జలింపకుందురే. ౮

మ. రతిరాజోజ్జ్వలమోహనాస్త్రము రమారామాతనూజాతసం
చితలోకాద్భుతజీవనౌషధము రాజీవాంశుగారామసం
స్థితదివ్యప్రసవాభసౌరభమిళద్దేవద్రుమరాజం బహో
శతపత్త్రాయతచారునేత్రఁ బొగడ న్శక్యంబె యెవ్వారికిన్. ౯

గీ. సరసిజాతాక్షి కీల్జడ చక్రికైన
నంబుధరవేణి లేఁగౌను హరికినైన
ముగుద ముద్దుమొగంబు సోమునకునైన
గణుతి యొనరింప శక్యంబు గాదు సుమ్ము. ౧౦

సీ. సకియముద్దుమొగంబు చంద్రబింబమె సుమీ
నెఱిదృక్చకోరముల్ నిలిచి యుండె
తరుణిచన్గుబ్బలు తమ్మిమొగ్గలె సుమీ
చూచుకభ్రమరముల్ సొంపు నెఱసె
వనజాక్షిపొక్కిలి వల్మీకమె సుమీ
రోమలతాభోగి రూఢి జాగె
బాలికామణివేణి నీలాంబుదమె సుమీ
శృంగారరసవృష్టి చిలుకఁ దొడఁగె
నహహ మనుజేశ యుత్తలిరాకుఁబోఁడి
సారసౌందర్య మమర భుజంగ యక్ష
గరుడ గంధర్వ కిన్నరాంగనల కైన
ఖచరవరవర్ణినుల కైనఁ గలదె చెప్పుమ. ౧౧

క. నడుమందము సైకపునె
న్నడుమందము తేటిదాటునకు దీటగుకీ
ల్జడచందము తద్దయు నె
వ్వడజిందము దెగడుగళము వఱలుం జెలికిన్. ౧౨

సీ. చంద్రవిస్ఫురణంబు సన్నగిల్లఁగఁ జేయు
నెలఁతనవ్వును మేను నెమ్మొగంబు
సారంగములఁ దిరస్కారంబు గావించు
మెలఁతచూపులు నడల్ మెఱుఁగుఁదురుము
చక్రంబులను భంగసరణిఁ గ్రిందొనరించుఁ
బొలఁతిగుబ్బలు కటి పొక్కిలియును
హీరంబులఁ గరంబు నీసడింపఁగఁ జూచుఁ
గలికిపల్చాలును గౌను నాఱు
నవనినాయక యాభువనాద్భుతాభి
నవవిలాసకళాసమున్నతి దనర్చు
చెలువ నరుమగ నిరుదుగతలలు గలుగు
వలఁతికైనను గణుతింప నలవి గాదు. ౧౩

శా. ఔరా సారలరాక్షికొప్పు చెలి కొప్పారుం బయోభృత్సనా
నీరప్రస్తరశైవలభ్రమరికాశ్రీలన్ విడంబించి మ
జ్జారే సారె విసారసారసతటిత్సారంగభృంగాంగభా
నారాచోత్పలకైరవోత్కరము నెన్నం జాలు దృగ్జాలముల్. ౧౪

గీ. కమల మయ్యింతిముద్దుమొగంబుఁ దొడరెఁ
గెలువఁజాలక రేకెత్తి దళము లెల్ల
విచ్చుటయు నీరజంబయి పిచ్చలించి
తరుణియడుగులు వట్టుక తరలకుండె. ౧౫

ఉ. చందురునందుఁ గందు జలజాతములందు రజోవికారముం
జెందఁగ ముద్దొనర్చి సరసీరుహగర్భుఁడు లోఁ గృశించి యా
నింద మఱల్పఁ గోఁ దలఁచి నేరుపుతో నకలంకమైన యా
సుందరిముద్దునెమ్మొగము చోద్యముగా సృజియింపఁబోల్ జుమీ.

సీ. ఉవిదకన్బొమలకు నోడి సింగిణివిండ్లు
వడి వంగి శర మూని యడలఁ జొచ్చె
సకియనాసకు నోడి సంపెంగపూమొగ్గ
విచ్చుమొగ్గై పోయె గచ్చుదఱిగి
చేడెపల్వరుసకు నోడి వజ్రపుఱాలు
పుడమి నదృశ్యమై యడఁగియుండె
యువతికెమ్మోవికి నోడి తామరకెంపు
బిట్టు త్రాసం బూని చట్టుపడియె
జలజముఖివీనులకు నోడి చక్కిలములు
పలుదెఱుంగుల నడి గనఁబడఁగ నలిగె
లోనుపడి యుండె నయ్యారె లోకు లెఱుఁగ
నధిప చెలిసోయగం బెన్న నలవి గాదు. ౧౭

క. ముకురాభవదన చెక్కులు
ముకురంబులఁ గరము దవిలి మూయఁగఁ జేయున్
సకియగళము దరముల ను
త్సుకత మెయిం దెల్లపుచ్చి నుడివడఁ జేయన్. ౧౮

గీ. రతిమనోభవకేళికారామపూత
లతలు సతిబాహువులు కిసలములు పాణు
లసమసాయకకాసారబిసము లతివ
భుజము లంభోజములు శయంబులు నృపాల. ౧౯

క. చెండ్లన్ మేలిమిబంగరు
గిండ్లన్ గజనిమ్మపండ్ల గీర్తింపఁగ బల్
గుండ్లన్ వనితామణిపా
లిండ్లకు సరి గావు గద మహీవరతిలకా. ౨౦

ఉ. పొక్కిలికల్గన వ్వెడలి పొంకపుఁగెంజిగురాకుమోవి ను
న్జక్కెరలప్పకై సరవి జాగి పథంబున నున్నగుబ్బచ
న్జక్కవదోయిఁ గాంచి చనఁజాలక నిల్చిన చీమచాలునాఁ
జక్కెరబొమ్మ నూరు విలసద్గతి మీఱు ధరాపురందరా. ౨౧

ఉ. నిద్దపుజాలువాపసిఁడినిగ్గుల నెమ్మొయి తమ్మికెంపుల
న్ముద్దుజిగారపుఁ దొగరుమోవి మదావళకుంభపాళిచేఁ
దద్ద బెడంగుజన్నవయుఁ దా నొనరించి విధాత యద్దిరా
దద్దిరమొల్లఁ గూర్చి వనితామణినెన్నడు మెట్లొనర్చెనో. ౨౨

క. జలధితరంగావళు ల
ప్పొలఁతుకవళులను జయింపఁబూని జడన్వాం
బలరారె నెగసిపడుచుం
బలుమాఱు గడంగి భంగపడియుడుఁగెఁ జుమీ. ౨౩

సీ. శుకవాణిజఘనంబునకు మిట్టుపల్లముల్
గల యిలతుల యని పలుకరాదు
బిసబాహపిఱుఁదుల కిసుమంత లేసియా
పులినంబు లెన యని పోల్పరాదు
తరుణిపెందొడలకుఁ బొర యూడి బిగి చెడు
ననఁటికంబంబు లీడనఁగరాదు
నాతిజంఘలకుఁ దృణప్రాయ మగుశాలి
గర్భముల్ దొర యని కాంచరాదు
ముగుదమీఁగాళ్ళకప్పల ముచ్చముడఁగి
మొనఁగు తాఁబేళ్ళు జత యని నుడువరాదు
చెలియపదములు గాఱెక్కు దళముఁ గొనెడు
చిగురుటాకులు సరి యని చెప్పరాదు. ౨౪

శా. ఆవాలుందెలికన్నుదామరలడా లాకప్పుపెన్గొప్పులీ
లావాటంపుగడానిబంగిరపుమే నాముద్దునెమ్మోముజా
నావిన్నాణపుగబ్బిగుబ్బగవసా రాకావికెమ్మోవితీ
రేవామాక్షులయందుఁ గల్గదు సుమీ యీ రేడులోకంబులన్. ౨౬

సీ. తళుకులేజెక్కుటద్దముల ముద్దులుగారు
నెమ్మేన నపరంజినిగ్గు దేఱఁ
బలుకులఁ గప్పురంపుపలుకు లుమ్మడిజాఱ
వాతెఱ నమృతంపువరద వాఱఁ
జూపుల విరిగల్వతూపు లుద్ధతి వాఱ
వేనలి శృంగారవృష్టి మీఱఁ
బాగరుగుబ్బలనాము పొరిఁబొరి దైవారు
నగుమొగంబునఁ గళల్ నిగిడి తూఱ
నహహా నృపచంద్ర యజ్జవరాలిసౌరు
సౌరవరవర్ణినులకైన నౌరగేందు
వదనలకు నైనఁ గలుగ దివ్వసుధఁ గలుగు
చేడియలు జోడగుదు రంచుఁ జెప్ప నేల. ౨౭

గీ. అర్జునాకృతి నలరుఁ జెల్వారుమేను
కృష్ణరుచిఁ గాంచె నాకబరీభరంబు
విజయశంఖాకృతిఁ దనర్చె వెలఁదిగళము
బాల నినుఁ బోలె మేనత్తపట్టి వగుట. ౨౮

క. బంగరుబొమ్మ తెలుంగున
రంగునఁ బొంగారు నక్కురంగీదృశతో
సంగతి యొనఁగూడదని నీ
శృంగారం బేల మేనిచెలువం బేలా. ౨౯

శా. ఓకందర్పునిదృగ్విలాస వినుమో హో పల్కులిం కేల యా
కోకద్వంద్వసమానపీనకుచ యాక్రొమ్మిత్తించు పెండీవ యా
పాకారాతిమణీఘృణీచకచకత్ప్రస్ఫీతధమ్మిల్ల యా
రాకాచంద్రనిభాస్య యామదవతీరత్నంబు నీకుం దగున్. ౨౯

క. అని తెల్పి యతని వీడ్కొని
చనియె విశారదుఁడు నై జనదనంబున క
గ్గనుఁ డంతట నక్కాంతా
జనరత్నము చెలువు మదిని సందడిఁ గొలుపన్. 30

ఉ. ఎప్పుడు గందుఁ గందు గలయిందుని నింద యొనర్పఁ బూను న
య్యొప్పులకుప్పముద్దుమొగ మొక్కట చక్కెరకమ్మదేనియల్
చిప్పిలు దానివాతెఱఁ గదిక్కన నెప్పుడు పంట నొక్కుదున్
ముప్పిరిఁ గొన్న మోహ మెద నూల్కొన నెప్పుడు గౌఁగిలింపుదున్.

క. ఎక్కడి సుభద్ర ద్వారక
యెక్కడ యీవార్త యెక్కడే నెక్కడ హా
తెక్కలిదెయ్యం బెక్కడి
మక్కువ గప్పించె నాదుమనసు గలంపన్. 3౨

ఉ. ఏల వసుంధరామరకులేంద్రుఁడు ద్వారక కేగ నేగి యా
బాలికచంద మెల్ల సులభంబుగ నా కిటుఁ దెల్పఁ దెల్పినన్
వాలెము దానిపై నిపుడు నామది యేల తవుల్కొనెన్ జగా
జాలి వెడంద మై పోదువఁ జాగ నహా యిఁక నేమి సేయుదున్.

చ. కడయిడరానికూర్మి మదిఁ గ్రమ్మ యొకప్పు డొకించు కేనియుం
గడి భుజియింప సైఁప దరగంటను గూరుకు రాదు మాయురే
వెడవిలుకానిచేతి కురువిందపుబొమ్మ యనం దనర్చు న
ప్పడఁతులమిన్నఁ గన్గొనెడుభాగ్యము నా కిఁక నెన్న డబ్బునో.

వ. అని మఱియును. ౩౫

క. చింతాక్రాంతుం డగుఁ గడు
సంతాపము జెందుఁ గుందు జాలినడలు దు
ర్దాంతానంతలతాంతశ
రాంతర్దశ లంతకంత కగ్గల మైనన్. ౩౬

మ. అళుకుం గన్నులనీరు చిల్కు నులుకున్ హా హా యనుం బిల్వ కే
పలుకుం బాన్పున నుస్సు రంచుఁ బొరలున్ బై లాలకించున్ దిశల్
గలయం గన్గొనుఁ బల్వరించు బెదరు న్గాసిల్లు లోలో నగున్
దల యూచున్ గిరియున్ నడించుకొను సంతాపాతిరేకంబునన్.

సీ. మగువయాకారంబు మఱి మఱి యెద నెంచు
నెట్టిసూడిద లిడ్డ నీసడించుఁ
జనవరుల్ మనవిచెప్పినఁ బరాకొనరించు
నోగిరం బిడె యన్న నోకిలించు
నొడలి మేల్ రవణముల్ బడి బడి నెడలించు
తమ్ములం బిడఁ జన్న నుమ్మలించుఁ
బరిచారకులు మ్రోల బలిసియున్న సళించు
మించుటద్దము గన్న సంచలించు
నదరిపడి లేచి నట్టెస లాలకించుఁ
గలికి వాడకట్టె నని బయల్ గౌఁగిలించు
పరవశత మీఱ నూరకె పలుకరించు
మదనవిశిఖాగ్నిదంద హ్యమానుఁ డగుచు. ౩౭

సీ. కలకంఠశుకశారికలధ్వాకలకు లోఁగు
కొదమతుమ్మెదచాల్పురొదకు వీఁగు
వలినాలిగాడ్పుబోఁదలసోకులకుఁ దూలుఁ
జలువచెంగలువతావులకు సోలుఁ

గలువయనుంగువెన్నెలకాకలకుఁ దారు
నలపుబన్నీటిదాఁకలకుఁ దాఁచుఁ
దలిరుగమ్మావిమోఁకలకు జెగ్గిలి కుంచుఁ
దెలిగప్పూరపుబూది కళుకు. జెందు
నాతతస్ఫీతబలమనోజాతశాత
చూతజలజాతవిశిఖసంఘాతఖాత
యాతనాధూతచేతోంబుజాతుఁ డగుచు
భూతలాధీశుఁ డిడుమలఁ బొరలుచుండు. ౩౯

మ. వడియున్ బ్రాసము నుజ్జగించి కపటవ్యాపార మేపార నె
ప్పుడుఁ గీడౌ నపశబ్దముల్ పలుకుచున్ భూరిప్రియాలంకృతుల్
సడలం జేసి పదార్థవాంఛ యొకపజ్జన్ లేక దుర్లక్షణం
బడరంగా కవిరీతి నుండె మతి లేకచ్చో సభాదూరుఁ డై. ౪౦

క. ఇవ్విధమునఁ గవ్వడి యా
జవ్వనిపైఁ దలఁపు నిలిపి జాలి యొసంగం
బువ్వవిలుకానిబాధలఁ
గ్రొవ్విరి లోలోనఁ గంది కుందుచు నుండెన్. ౪౧

సీ. అక్కడ సుభద్రయును దమ యన్నమ్రోల
నక్కజంబుగ విజయుని చక్కఁదనము
విప్రపుంగవుఁ డెఱిఁగింప విని మనమున
నాశుభాకారు వరియించునాస దవిలి. ౪౨

ఉ. ఎన్నఁడు చూతు నేను దివశేంద్రకుమారరమాకుమారులం
గిన్నరరాట్కుమారుని బ్రకృష్టమనోహరరూపరేఖ చే
బన్నము నొందఁ జేయఁ దగుభవ్యతరాకృతివాని నిద్దపుం
బున్నమచందమామ మనగఁ బూనుముఖాబ్జమువానిఁ గవ్వడిన్. ౪౩

శా. ఆరాజన్యశిరోవతంసము సముద్యత్ప్రీతి నన్ గౌఁగిటన్
గారామారఁగఁ గూర్చి పేర్చు నెలమిం గందర్పకేళీకళా
ధౌరంధర్యము మీఱ నేలుకొన సద్యస్సౌఖ్యలీలాపయః
పారావారమునందుఁ దేలెడుమహాభాగ్యంబు నా కబ్బునే. ౪౪

ఉ. ఆరయ నాదు దివ్యమణిహారమహారజతప్రసక్తభూ
షారుచిరాంబరాదులును సారపటీరతుషారనీరకా
శ్మీరమృగీమదాగరులుఁ జిత్రనికేతనవీటికాదులుం
గోరఁగ నేల యానృపతికుంజరునెయ్యము గల్గకుండినన్. ౪౫

క. ఎన్నఁ డిటు వచ్చు నగ్జునుఁ
డెన్నఁడు ననుఁ బెండ్లియాడు నిం పొదవఁగ న
న్నెన్నఁడు కౌఁగిటఁ జేరుచు
నెన్నఁడు నాకోర్కి దీర నెనసి సుఖింతున్. ౪౬

ఉ. ఆలలనామనోజుఁడు సమాదరలీలల నాగళంబునన్
మేలిమితాళిబొట్టు రహి మీఱఁగఁ గట్టి సుపాణిముత్తెపుం
బ్రాలు శిరంబుపై సురుచిరంబుగ నించినయేని గట్టురా
చూలికి నోలిఁ బూజ లిడి జోత లొనర్చి కడంకఁ గొల్చెదన్. ౪౭

ఉ. అద్దిర నాకు వానినెన రబ్బకయున్నఁ గడింది జాలిలో
దద్ద వెడందమై పొదవి దర్పకబాణపరంపరార్తిచే
నెద్దొసఁగుల్ ఘటిల్లునొ మహీజను లేమని యెంతురో కదే
సుద్దుల కేమి తమ్మిపువుచూలితలం పెటు లున్నదో కదే. ౪౮

ఉ. అవ్విభుచెంత కేగి వినయంబున నాతెఱఁ గెల్లఁ దెల్పి రా
నెవ్వరి వేఁడుకొందు నటు లేగి యనుంగులు విన్నవించినన్
నవ్వుల బెట్టి యయ్యవనినాయకుఁ డెగ్గుగఁ నెంచు నేమొ కా
దవ్వులవార్త లేద వనితామణు లేడ బెడంద లేడి కన్. ౪౯

సీ. ప్రియమార్గ మరరార బిరబిర నచటికా
నేలవేల్పులపెద్ద యేల వచ్చె
వచ్చె యచ్చెలువుగా విచ్చలవిడి నాసు
రేంద్రసూతియొయార మేల తెలిపెఁ
దెలిపిన నలరి దొంతేకూర్మి మెఱయ నా
హృదయ మాతనిమీఁద నేల తవిలెఁ
దవిలిన తెఱఁగు వంతనమున నోములకు
నెఱిఁగింపఁబోవ సిగ్గేల పొడమెఁ
బొడముగా కేమి యమ్మొటుపొందు నాకుఁ
గలుగుకొఱకెట్టి మున్నటికల మొలఁగిన
మొలఁగఁదగుఁగాక యహహా యీవలపు నిలుప
నలవియొ యటంచు మఱియు నన్నలిననయన. ౫౦

మ. కలయంగోరుఁ గవుఁగిలింప దివురుం గాసిల్లుఁ గన్మోడ్చుఁ జె
గ్గిలుఁ గెంగేల్ నునుఁజెక్కునం దిడు దిశల్ ద్రేగంట వీక్షించు వా
త్యాలఁ బోవున్ జయ లాలకించు వగచున్ వేసారు దూపిల్లు నాఁ
డల యాఁచుం బలవించు నుస్సురను వంతం గుందు నెంతేనియున్.

క. అద్దము గన్గొని నొసలన్
దిద్దదు కస్తూరిరేఖ తిన దన్నం బే
కొద్దిగ నేనియుఁ గంటికి
నిద్దుర గానదు విడెంబు నెఱిఁగొన దెపుడున్. ౫౧

చ. చిలుకలఁ గొట్టు నెచ్చెలులు చెంతకు వచ్చినఁ దిట్టు నూరకే
కిలకిల నవ్వు నంచలను గించు కరంబున రువ్వు శారికల్
పలికినఁ గుందుఁ దుమ్మెదలపాటలకుం దిగులొందు నద్దిరా
చిలుకలకొల్కి యుబ్బరపుఁజిత్తవికారము లెన్నఁ జిత్రముల్. ౫౨

సీ. పలుఁగు మత్తమయూరకలహంసకాకీర
కలకంఠకంఠహుంకారములకు
మలఁగు నానాసూనమకరందరసపాన
ధావన్మధువ్రతారావములకుఁ
పలఁపుఁ జందనశైలతటసమాగతబాల
మందగంధానిలాస్పందములకు
నలుకు శీతమయూఖవిలసితకిరణౌఘ
సాంద్రచంద్రాతపాసారములకు
తలఁగు నుద్దండపటుగజాదండనిహిత
చంద్రపుంద్రేక్షుకోదండదండగళిత
రతిమనోహరఘోరనారాచములకు
మిగుల మది నొడి యమ్మద్దుచిగురుఁబోఁడి. ౫౪

క. అటు లర్జునుఁడు సుభద్రయుఁ
బటుతరమోహాంధకారపరవశత మెయిం
గటకటఁ బడుచుండిరి హృ
త్పుటముల నుద్వాహకాంక్ష పొరిఁబొరి బెరయన్. ౫౫

ఉ. అంతట నొక్కనాఁ డొకధరామరవర్యునిగోవుఁ దస్కరుల్
పంతన మొప్పఁ దోలుకొని చయ్యన నేగిన నాతఁ డెంతయున్
వంత గలంగి శీఘ్రమును వక్త్రము నుమ్మడి మోఁదుకొంచు న
క్కుంతికుమారు మేడకడఁ గుయ్యిడిన న్వివి తత్తరంబునన్. ౫౬

గీ. మేడ డిగ్గనుఱికి క్రీడి విప్రుని డాసి
యతనిమాట లెల్ల నాలకించి
వెఱపు మాన్చి పాండవేయాగ్రజుని మేడ
కేగి విల్లునమ్ము లెలమిఁ గొనియె. ౫౭

మ. కొని యాచోరులఁ ద్రుంచి బ్రాహ్మణునకుం గోవు న్సమర్పించి గో
బ్బున నేతెంచి కృతాంతసూతికి సతుల్ పొల్పారఁ గావించి తా
మును నెయ్యంబునఁ జేసికొన్న నియమంబుం దెల్పి యొక్కొండు దా
బనిమీఁజన్ ధరణీప్రదక్షిణ మొనర్పం బోవఁ బ్రార్థించినన్. ౫౮

క. ధర్మజుఁ డర్జునుఁ గనుఁగొని
నిర్మలమతిఁ బలికె నిట్టి నియమంబులు దు
ష్కర్ములకుఁ గాక సదమల
ధర్మవిచారులకు నేల తత్త్వజ్ఞధీ. ౫౯

గీ. గోప్రదక్షిణంబు సుప్రీతిఁ జేసిన
గోప్రదక్షిణం బగుం గదయ్య
యట్లు సేయు మనిన నతఁడు విన్నంబోయి
పలికె మృదులమధురభాషణముల. ౬౦

గీ. అన్న ధర్మరాజ మున్ను తీర్థాచర
ణంబు సేయుబుద్ధి నాకుఁ గలదు
కార్యకారణములు గదు నేక మయ్యె ని
త్తఱిని దనకు దాని దైవగతిని. ౬౧

క. కావునఁ దీర్థాచరణము
గావించి రయంబ వత్తుఁ గన్నన సెల వి
మ్మా వల దని పలుకక యని
వేవేలవిధముల మ్రొక్కి వేఁడిన నతఁడున్. ౬౨

గీ. సమ్మదము నొంది యపుడు విశారదుండు
మొదలుగాఁ గలవిప్రోత్తములను బరిజ
నములఁ గొందఱిఁ దోడిచ్చి సముచితప్ర
కారమునఁ బల్కి దీవించి కౌఁగిలించి. ౬౩

క. పొమ్మని యానతి యొసఁగిన
నమ్మనుజాధీశమణికి నభివాదనముల్
గ్రమ్మఱ నొనరిచి బంధుజ
నమ్ములచే నాజ్ఞ గొని మనం బలరారన్. ౬౪

క. కుంతికిని భీమసేనున
కెంతయు సద్భక్తి మ్రొక్కి యెలమిఁ గవలకున్
సంతస మొదవఁగఁ బలికి ని
జాంతఃపురి వెడలెఁ బరిజనాన్వితుఁ డగుచున్. ౬౫

గీ. అవ్విధంబున ధర్మరాజానుమతిని
దగినహితబంధుతైర్థికోత్తములతోడఁ
గూడుకొని క్రీడి గడితంపువేడ్క కలర
భూప్రదక్షిణ మొనరించుబుద్ధి నరిగె. ౬౬

చ. సురుచిరలీలఁ గన్గొనియె శోభనదివ్యసరోజమాలికా
పరిమళలాభలోభమదబంభరడింభరవానుషంగదు
ర్భరదురితౌఘభంగనతిభాస్వరగాఢతరంగరంగదీ
శ్వరమకుటాగ్రరంగశుభసంగను గంగఁ దగంగఁ జెంగటన్. ౬౭

క. కనుఁగొని హర్షాద్భుతములు
మనమునఁ బెనఁగొనఁగ నికటమహిఁ జాగిలి వం
దనము లొనరించి మృదుకర
వనజంబులు మౌళిఁ జేర్చి వడి నుతియించెన్. ౬౮

క. అంగజహరమకుటాంతర
రంగా విమలాంతరంగ రంగత్తుంగా
భంగతరంగా వృతచ
క్రాంగా నతి సేతు నన్ను నరయుము గంగా. ౬౯

గీ. అవ్వ నివ్వ దవ్వు దవ్వులఁ బొడఁగన్న
ముక్తి కల్గునఁట యమోఘభంగి
నీట మునుఁగుఫలము నే నెఱుంగను సురా
దివ్యతరతరంగ దివిజగంగ. ౨౦

క. జ్వాలాభీలానలయుత
హాలాహల మారగించి హరుఁ డటు సోలన్
నీలలితామృతలేశము
మౌళిపయిం జిలికి యతని మనిచితివి గదా. ౨౧

శా. నీతీరద్రుమకోటరాంతరచరన్నీడోద్భవశ్రేణులున్
నీతోయాశ్రితమత్స్యకచ్ఛపములు న్మ్రించున్ నిజేజేంద్రసం
ఘాతారోకిత ఘంటికాఘణఘణత్కారాతిభీతాహిత
వ్రాతాంభోజముఖీజనస్తుతమహారాజన్యకం బెన్ సతీ. ౨౨

శా. నీనీరంబులఁ దోఁగుమానవుఁడు నిర్నిద్రప్రభావంబునన్
నానాకల్మషకోటి మీటి దివిషన్నారీజనోపేతుఁ డై
యానందప్రదరత్నకీలితవిమానారూఢుఁ డై స్వర్గభో
గానూనస్థితి నుల్లసిల్లుఁ గద గంగా మంగళాంగీమణీ. ౨౩

క. అని కొనియాడుచు నన్నది
మునుకలు గావించి దానముల విప్రతతిం
దనియించి తత్తటంబున
ఘనతరమౌనమున జపము గావించు నెడన్. ౨౪

గీ. సరగ నచటి కుటూచినాఁ బరఁగు నొక్క
యురగకన్యక నెమ్మది నరుగు దెంచి
నరుఁ గనుంగొని తన్మనోహరవిలాస
విభ్రమములకుఁ గడు మనోవీధియందు. ౨౫

ఉ. అబ్బురమొంది చంద్రుఁడో జయంతుఁడో కంతుఁడో యవ్వసంతుఁడో
లిబ్బులరాచపాపఁడో భళీ యితఁ డారయఁ గాకయున్న నీ
నిబ్బరపుంజగాసాగను నెక్కొన నేర్చునె వీనిఁబోమ్ముసన్
గుబ్బలు గ్రుచ్చి హెచ్చరికఁ గ్రుమ్ములతాంగిదె భాగ్య మెన్నఁగన్.

చ. తొగరుమెఱుంగువా తెఱయుఁ దోరపుగ్రొవ్విరిదమ్మిఱేకులన్
నగఁ దగుకన్నుదోయి పులినంబుల గేరుపిఱుందునందమున్
సొగసులు గుల్కుపెన్నెరులు చొక్కపుముద్దుమొగంబు గల్గు నీ
జగమగనిం గనుంగొనినచాన విరాళిఁ గలంగకుండునే. 22

ఉ. చక్కెరవింటిదంట నెకసక్కెము లాడఁగదయ్య వీనిమేన్
చక్కదనంబు నెన్నడుము సౌరు గలంచుగదయ్య సింగముం
జెక్కులపెక్కు తీరుపడఁ జేయుఁగదయ్య మెఱుంగుటద్దము
న్నక్కవ వీని కౌఁగిటఁ బెనంగెడుభాగ్యము నాకుఁ గల్గునే. 23

గీ. వీనిమోవితేనె లాని చెక్కుల ముద్దుఁ
గొని మిటారిగబ్బిగుబ్బగవ ను
రమ్ము గ్రుమ్మినెమ్మి కమ్మవిల్తుని కేళి
నెనయుకున్న వయసి దేల నాకు. 24

క. అని మిగుల మున్నరికె నా
తని నెత్తుక వేగ బఱచి తన కేళిగృహం
బున నునిచిన నవ్విజయుఁడు
గను విచ్చి కడంది మోఱఁ గని యుల్లమునన్. 30

సీ. నవనవకిసలయోన్నతరసాలము వోయి
మినుకుబంగరుమేడ మెఱయు టేమి
యత్యుగ్రమణిసైకతాగ్రభాగము వోయి
చలువగ్రొన్ననపాన్పు మలయు టేమి

నిస్తంద్రకల్లోలనికురంబములు వోయి
　　　　రేరాచరామెట్లు గూరు కేమి
పరిఫుల్లజలజాతపరిమళంబులు వోయి
　　　　కమ్మకస్తురితావి గ్రమ్ము కేమి
యహార నే మున్ను సురసరిత్తీరభూమి
నున్నయది లేదొ కల గంటినో మఱేమి
మాయయో కాక యిది యంచు మఱలి చూచు
నవసరంబున నరిదియొయార మెసయ. ౧౧

౨. తలుకుపసిండిబొమ్మయొ సుధాకరరేఖయొ మించుదీవయో
చిలుకపఠాణితేజిదొరచేతినిగారపునిల్వుటద్దమో
వెల గనరానిమానికమొ వెన్నెలతేటయొ నాఁ దనర్చు లేఁ
గులుకుమిటారి నొక్క మదకుంజరగామినిఁ గాంచెఁ జెంగటన్. ౧౨

౩. కాంచి దానిమనోహరాకారరేఖ
కద్భుతం బంది యహార యియ్యంగనాల
లామ మారునిసామ్రాజ్యలక్ష్మి యనఁగఁ
బరఁగుచున్నది కన్నులపండు వగుచు. ౧౩

౪. చూడమె చెప్పఁగా వినమె శోభనకాంతియుతాంగులైన యీ
రేడుజగంబులందుఁ గలయిందునిభాస్యల వార లెల్ల నీ
చేడియమేలుబంతి కెన సేయ నొకింతయుఁ బోలనేర్తురే
వేడుక యయ్యెఁ బో మదికి వేమఱు నీమదిరాక్షిఁ జూచినన్. ౧౪

౫. కన్నులచెన్ను నెమ్మయినిగారము చెక్కులపెక్కు మోముగో
మన్నులికౌనుజాను మొగమందము వేనలిబాగు కుల్కులేఁ
జన్నులసీటు ముత్తరులసౌరు వెడందపిఱుందుచంద మ
న్నన్న కడింది వై మదికి నత్యనుమోదము గూర్చె నిమ్మెడన్. ౧౫

క. అని కొనియాడుచుఁ జెంతం
గనుపట్టునొయారిఁ గలువకంటిం గని య
య్యనిమిషరాజతనూభవుఁ
డెనలేని మనోనురాగ మెనయఁగఁ బలికెన్.

ఉ. ఎక్కడదాన వీవు హరిణేక్షణ యీజగ మెద్ది నీవు న
న్నిక్కడి కేల తెచ్చితి విదేమిటి యోజ దృఢవ్రతస్థు లై
దిక్కులవెంబడిం జనువిదేశుల ని ట్లొనరింపఁ బాడియే
యక్కట చేల నై యురక యారడిఁ జెందుట మేలె చెప్పవమ్మా.

గీ. అనిన నప్పాఁపరాజవరాలు రాచ
మిన్న తిన్ననినిడుసోఁగకన్నుదోయి
దేలఁ గన్గొని యోసుదతీమనోజ
వినుము నాచంద మంతయు విన్నవింతు.

గీ. ఈజగంబు రసాతలం బే నులూచి
యనుభుజంగమరాజకన్యకను నీవి
లాసగరిమంబు గాంచి యుల్లాస మొదవ
నిన్ను వరియింపఁ గోరి బల్మి న్నరికల.

క. ఇటఁ దెచ్చినదాన విశం
కటకరుణాలోకనమునఁ గన్గొని నను నె
క్కటివలరాచదురంబునఁ
బటుగతి నలరించి ప్రోవు ప్రమదం బెసఁగన్.

గీ. అనుడు నుడురాజముఖి కిట్టు లనియెఁ గ్రీడి
భూతలం బేడ భుజగేంద్రభువన మేడ
తరుణు లెచ్చట మఱియన్యపురుషు లెచట
నహహ యీదుండ[illegible]ం జేల యహిపబాల.

క. మోహావేశంబున నెవ
రూహింపఁగఁ బరుని గోరు టుచితమె నీకీ
ట్లాహా మే ల్మే లెంతటి
సాహసురాలవె భుజంగసారసనయనా. ౬౨

సీ. కాముకుఁడు గాక వ్రత మూని భూమిఁ దిరుగ
నేమమునఁ బోవు నన్నిట కేమిపనికిఁ
బ్రేమమునఁ దెచ్చి తిది మేరయే మనోజ్ఞ
సోమబింబోపమానాభిరామవదన. ౬౩

తే. నయమున విధిజ్ఞులైనట్టి నరపతులకుఁ
బరవధూమణి నెనయఁగఁ బాడి యగునె
చేల యీరిత్తకోర్కి నీ కేల యనిన
భావము గలఁగి యప్పాపహాఁపపాప. ౬౪

వ. కనుఁగవ నశ్రుబిందువులు గ్రమ్మఁగ గద్గదకంఠ యై మొగం
బునఁ గడు విన్నబాటొదవ ముప్పిరిగొన్నవలవంతఁ బల్కె నో
జనవరచంద్ర రాజనయవిశారద రాజజనరంజనైకశో
భనతరరూప రాఘవకృపా యిటు లాన తిడఁగఁ జెల్లునే. ౬౫

సీ. కన్నియను గాని వేఱొండు గాదు నీకు
జన్నె యిడియుంటి నామెలజవ్వనంబు
ప్రాణరక్షకు మిగులఁ బుణ్యంబు గలదె
నీ వెఱుంగవె సత్కృపానిధి వధీశ. ౬౬

సీ. మానవాధీశ యిఁకఁ బెక్కుమాట లేల
ఘోరమారకిరాతదుర్వారవిశిఖ
శిఖిశిఖాయాతనలచేఁ గృశింపనీక
నీకవుంగిటఁ బొదవి మన్నించు మిపుడు. ౬౭

గీ. అనిన మదిలోఁ గరంగి యమ్మనుజవిభుఁడు
దానికెంగేలు వట్టి పూఁపానుపునకుఁ
దార్చి స్మరశాస్త్రనియతి విస్తరిల మదన
కేలికాసౌఖ్యజలరాశి నోలలార్చె. ౯౮

క. అంతట నమ్మహికాంతుఁడు
కాంతాలోకైకచూళికారత్నము న
త్యంతముదంబునఁ గన్గొని
యింతిం దనరానికూర్మి నిట్లని పలికెన్. ౯౯

గీ. రమ్మ ఫణిరాజకులకరిరాజయాన
యిచట నింక జాగొనర్చిన నచట తైర్థి
కావనీసురు లాత్మ నేమని తలంత్రు
పోయివచ్చెద సెల విమ్ము పొలుపు మీఱ. ౧౦౦

ఉ. నావుడు విన్నబాటొదవ నాగకులాంబురుహాక్షి వల్కె నో
భావజరూప యోపరమపావన యోరసికాగ్రగణ్య నిన్
బోవఁగ వద్దటంచు మదిఁ బొంగెడుకూరిమితోడ నాడినన్
దేవరచిత్తవృత్తి యొకతీరుగ నుండునొ యేమిసేయుదున్. ౧౦౧

. ఎన్నఁడు చూతునొ నిను నా
కన్నులకర వెల్లఁ దీరఁ గ్రమ్మఱ నింక నా
పన్నజనావన గుణసం
పన్నా ధీమత్ప్రసన్న ప్రభుజనమాన్యా. ౧౦౨

శా. నీచెల్వంబును నీవిలాసమును నీనిర్నిద్రతేజంబు నీ
వాచాప్రౌఢిమ నీకృపాగుణము నీవైదుష్యసామగ్రియున్
నీచంచన్నయనాబ్జవీక్షణము నీనిత్యప్రసన్నత్వమున్
నాచిత్తంబునఁ బాయఁజాలదు గదా నాకీలతాంతాయుధా. ౧౦౩

క. నీకును నాకును నేస్తం
బీకరణిం గూర్పె నేల యెడఁబాయఁగ నే
లా కట్టికెదయ్యం బిఁక
వాకులు పై క్కేల విబుధవర్ణితశీలా. ౧౨౪

ఉ. మల్లడిఁగొన్న ప్రేమమున మన్మథరాజ్యసుఖైకలీలలం
బెల్లుగ నిన్నుఁ గూడుకొని పెక్కుదినంబులు వేడ్క నుంటి నే
నెల్లెడలందు నిన్నె స్మరియింపుచు నుండుఁ దలంపు జేసి నీ
యుల్లమునందుఁ జాల దయ యుంచుము రాజముఖీమనోభవా.

గీ. అని పలికి కల్కి మేల్బంతి యతని నపుడె
మరల జాహ్నవికడఁ జేర్చి మదిఁ జెనంచు
కూర్మి నక్కనఁ బొదపు కన్గొనల బాష్ప
కణము లురలంగఁ దనదులోకమున కేగె. ౧౨౬

గీ. అంతఁ ద్రైదికహితభూసురాదిజనులు
నృపతిరాకకుఁ గడు నుత్సహింపుచుండి
రప్పుడు విశారదుని జూచి యర్జునుండు
పలికె నిట్లని యతిమృదుభాషణముల. ౧౨౭

సీ. వింటె విశారద వింత యొకటి నేను
జాహ్నవీతటమున సంధ్య వార్చి
జపమొనర్చుచు నున్నసమయంబునందు ను
లూచియ న్నన్నగలోలనయన
యొక్కతె వచ్చి న న్నక్కవఁ దోడ్కొని
చని తన కేళికాసౌధమునను
నిలిపి తన్గవయుమం చెలమితో బహువిధం
బులఁ బ్రార్థనము చేసి మ్రొక్కుటయును

మగువదీనత కెంతయు మది గరంగి
దానికోరిక సఫలంబుగా నొనర్చి
సమ్మతిలఁ బల్కి క్రమ్మఱ సరగ నిచట
కరుగుదెంచితి నెమ్మది యతిశయిల్ల. ౧౦౮

క. ఆచిల్వచెల్వచెల్వము
వాచస్పతి కైన భోగివరునకు నైనన్
బ్రాచుర్యగతి నుతింప న
గోచర మగు నితరజనులకుం దరమగునే. ౧౦౯

చ. తళుకుఁబసిండిబొమ్మ నెఱతావులగొజ్జఁగిపూవుఁగొమ్మ క
న్నులవిలుకానితూపు జిగి నూల్కొనుకాలు మెఱుంగుకోపు వె
న్నెలనడుచక్కితేట వెల నిచ్చినబ్రతనంపుమూట యే
లలనలు దానితోడుతఁ దులా? వితలాతలభూతలంబులన్. ౧౧౦

ఉ. ఆపెనుగప్పుకొప్పుసొగ సొప్పుచెండులఁ జెండుగుబ్బల
ద్దాపసమించు మించుతెగ నాగి జయింపుమిటారిచూపుకో
పాపుడమిం దమిం బరమునట్టిపిఱుందుపసం దయారె యా
పూపనిగారపున్వయసు పోటుల చోటుల నెన్న నున్నవే. ౧౧౧

సీ. పెనుగప్పునునుగొప్పునను గుప్పవిరితావు
లరిజాలముల నామెతలకుఁ బిలువ
మగమీలడెగఁ జాల నగువాలుఁజూపులు
చలదురుమాపులై జనులగాడ
బలుగుబ్బలులగిబ్బ వలిగుబ్బచనుదోయి
సొబగు చూపరమది చూఱఁగొనఁగ
బగడాల జగడాలు దగనేలు జిగిమోవి
యువజనంబులకు నోరూరఁ జేయ

సారస రంగమదఘనసారగంధ
సారనీహారనీరకాశ్మీరభూరి
సౌరభంబులు దిశల హెచ్చరికఁ బర్వ
నురగకులబాల నామ్రోల నొరపు నెఱపు. ౧౧౨

గీ. వేయునేటికి విను దాని సోయగంబు
దానిఁ బుట్టించినట్టి విధాతకైనఁ
బొగడరా దన్యులకు నెట్లు పొగడవచ్చుఁ
జిత్తజునిపైఁడిబొమ్మ యాచెలువకొమ్మ. ౧౧౩

గీ. అనిన నందఱు సంతసం బంది యతనిఁ
బెక్కుతెఱఁగులఁ గీర్తించి రక్కిరీటి
యనుచరబలంబుతోఁ గూడి యచటఁ దరలి
చనియె నెమ్మది నీహారశైలమునకు. ౧౧౪

సీ. పటుబలోద్ధతఘోరపంచాస్యనఖశీర్య
మాణదారుణకుంభమస్తకంబు
తతగుహాంతరనిరంతరచరద్భయదోగ్ర
శార్దూలనికురంబసంకులంబు
నిబిడపాటీరద్రునిష్కుహాంతర్లగ్న
ఫణిఫణామణిఘృణిభ్రాజితంబు
ఘనఝరీలీనదాభ్రగజాభ్రమాయిత
ప్రమదనృత్యన్మత్తబర్హిణంబు
సరససంగీతవిద్యాప్రసంగరంగ
మాణగంధర్వయక్షగీర్వాణఖచర
సుందరీబృందపరివృతకందరంబు
పుణ్యగణ్యంబు నీహారభూధరంబు. ౧౧౫

గీ. అన్నగం బెక్కి యచటిచోద్యంబు లెల్లఁ
గనుఁగొనుచుఁ గొంతతడ వచ్చటను మెలంగి
కదలి యాతఁ డదంతికాస్త్యవటము
హీరుహము గాంచి చనె భృగుశృంగమునకు. ౧౧౬

గీ. అచ్చట హిరణ్యబిందుతీర్థావగాహ
నంబు గావించి విహితదానము లొనర్చి
చనియెఁ బరిజనతైర్థికసహితుఁ డగుచుఁ
బుణ్యాకర మైన నైమిశారణ్యమునకు. ౧౧౭

క. ఆరూఢభక్తి నచ్చట
నారాయణుఁ బూజ చేసి హరిపుణ్యకథా
సారామృతపానుం డై
యారాకొమరుండు చనెఁ బ్రయాగంబునకున్. ౧౧౮

క. సంగాతులు దానును మదిఁ
బొంగుచుఁ గైదండ లూని పొదవి త్రివేణీ
సంగమున మునిఁగి సతజన
మంగళనాయకుఁ బ్రయాగమాధవుఁ గొలిచెన్. ౧౧౯

క. వారక తైర్థికజనపరి
వారంబులఁ గూడి పెక్కువారంబులు త
ద్వారివిహారము సలిపి య
వారణ నటఁ దరలి చనియె వారాణసికిన్. ౧౨౦

సీ. మణికర్ణికాతీర్థమజ్జనం బొనరించి
గంగానదీస్నానకలనఁ దనరి
లోలార్కముఖు లైన హేళుల దర్శించి
కాలభైరవు మహాకాళుఁ గొలిచి

యాది కేశవుల నత్యామోదమున నెంచి
బిందుమాధవదేవుఁ బ్రేమఁ గాంచి
శ్రీవిశాలాక్షి నక్షీణభక్తి భజించి
విశ్వేశ్వరస్వామి వినుతి చేసి
భూనుతము లైన పుణ్యనదీనదముల
స్నానములు దానములు హితసరణిఁ జేసి
కోటిలింగస్థలములు గన్గొని కడంక
డుంఠివిఘ్నేశుఁ బ్రమథరాట్పుత్రుఁ బొగడి. ౧౨౧

క. రయమున నచ్చో వెలువడి
గయకుం జని పితరులకుఁ దగం బరలోక
క్రియ లాచరించి గో ధన
హయ గజ దానముల భూసురావళిఁ దనిపెన్. ౧౨౨

క. కుతుకమున నందు వెలువడి
కతిపయదినములకుఁ జేరి కనుఁగొనియె మహో
న్నతవితతశృంగభాగా
న్వితతులసీకాననంబు నీలనగంబున్. ౧౨౩

క. అంతట నింద్రద్యుమ్నస
రోంతరమునఁ దీర్థమాడి యరిగి సుభద్రా
కాంతునిజనసన్నుతగుణ
వంతు జగన్నాథు సాధువత్సలుఁ గాంచెన్. ౧౨౪

క. కాంచి ప్రణమిల్లి తులసీ
కాంచనపుష్పములఁ బూజ కడుభక్తిని గా
వించి ప్రసాదములు సమ
ర్పించి నుతింపఁగఁ దొడంగె మృదుమధురోక్తిన్. ౧౨౫

కం. పరికింపఁ బతితపావన
బిరుద మెప్పుడు నీకుఁ జెల్లుఁ బృథివిస్థలి నీ
సరి యగువేలుపు లేరీ
నిరుపమకరుణానివేశ నీలాద్రీశా. ౧౨౬

సీ. కమనీయతపనీయకౌశేయకమువాని
దళదరవిందనేత్రములవాని
సంపూర్ణపూర్ణిమాచంద్రాననమువానిఁ
గరతలశంఖచక్రములవాని
బలసుభద్రాసతీపరివృతుం డగువాని
నీలమేఘాకృతిఁ గ్రాలువాని
నిరుపమశృంగారనీరధి యగువానిఁ
బతితపావనుఁ డనఁ బరఁగువాని
సకలలోకైకనాయకుఁ డయినవాని
నిన్నుఁ బొడగంటి శుభములు నెఱయఁగంటి
నీలనగవాస విబుధవర్ణితవిలాస
శ్రీజగన్నాథ విజయలక్ష్మీసనాథ. ౧౨౭

ఉ. వాసవముఖ్యదిక్పతు లహర్నిశము గొల్చుభవత్పదాబ్జముల్
భాసురలీలఁ గంటి సులభం బగుమే ల్గయికొంటి విచ్చెఁబో
చేసినపాపసంఘములు చెప్పెడి దేమిఁక నాయదృష్టమో
దాసమనోరథార్థఫలదాయక నీలనగాధినాయకా. ౧౨౮

గీ. శిఖరదర్శనంబు చేసినమాత్రనె
తొలఁగుచుండు సకలదుష్కృతములు
నిన్నుఁ జూచుపుణ్య మెన్న నేరితరంబు
నయవిలాస నీలనగనివాస. ౧౨౯

గీ. అని జగన్నాథుఁ గీర్తించి యచటఁ దరలి
మోహన మిగులోత్త శ్రీకూర్మమునకు నేగి
నతజనశరణ్యుఁ డగుకూర్మనాథుఁ గొలిచి
యచటు వెడలి త్రోవఁ జనుచుండె నన్నరుండు. ౧౩౦

క. అని శౌనకాదిమునులకు
ననఘాత్ముం డైన రోమహర్షణి యెఱిఁగిం
చిన నాలకించి వారా
యన నవ్వలికథయుఁ దెలుపు మని వేఁడుటయుఁన్. ౧౩౧

చ. సరసిజపత్రనేత్ర మునిసన్నుతిపాత్రచరిత్ర కల్మషో
త్కరలతికాలవిత్ర నిజదాసజనావనసూత్ర దుగ్ధసా
గరతనయాకళత్ర మిహికాకర శేఖరమిత్ర వృత్రసం
హరమణిజాలనీలజ దాంచితగాత్ర విచిత్ర వైభవా. ౧౩౨

క. పారావారాగారా
సూరిజనాధారమారసుషమాకారా
ఘోరాఘాత్రసహారా
పారదయాపూర నీలశైలవిహారా. ౧౩౩

మాలిని. అతులితగుణధామా హారిశృంగారసీమా
శతధృతినుతనామా సర్వలోకాభిరామా
క్రతుభుగవనకామా ప్రాంచదాకారకామా
దితినుతకులభీమా దేవతాసార్వభౌమా. ౧౩౪

గద్య. ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణసంలబ్ధ సారకవితా విచిత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలవిద్వజ్జనవిధేయ జగన్నాథనామధేయ ప్రణీతం బైన సుభద్రాపరిణయం బను శృంగారప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.





శ్రీ

# సుభద్రాపరిణయము.

## తృతీయాశ్వాసము.



శ్రీరుచిరగుణనివేశా
దూరితఖలనాశ ఘోరదులితవినాశా!
భూరితరనిజనివేశా
నీరేజహితప్రకాశ నీలాద్రీశా. ౧

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమునికు
లేంద్రులకు రౌమహర్షణి ఇట్టు లనియె
వట్లు తెరవునఁ జని చని యర్జునుండు
గాంచె ముందర నతితరోత్కంఠుఁ డగుచు. ౨

కం. సింహాకారోజ్జ్వలము నృ
సింహాశ్రితతలము కలుషసింధురపటలీ
సింహాయితజలము మహా
సింహావృతబిలము నైన సింహాచలమున్. ౩

వ. మఱియు నమ్మహీధరంబు కైలాసకుధరంబునుం బోలె నీలకంఠా
వాసం బై మేరుశైలంబునుం బోలె నమేయగైరికచ్ఛాయం బై వైకుం

తపురంబునుం బోలె హరినిత్యనివాసం బై బ్రహ్మలోకంబునుం బోలె పరమహంససమావృతం బై యలకాపురమునుం బోలె నగణ్యపుణ్య జనశరణ్యం బై రసాతలంబునుం బోలె ననంతనాగేంద్రాక్రాంతం బై పాథోనిధానంబునుం బోలె నశ్రాంతబాడబాశ్రయం బై త్రిదివంబునుం బోలె ననవరతరంభావిజృంభమాణం బై మహారాజన్యరాజ్యంబునుం బోలె నపరిమితకటకవిశంకటం బై సుకవికావ్యంబునుం బోలె ననేకమతకోకిలవ్యాకులం బై నైమిశారణ్యంబునుం బోలె శుకముఖద్విజకులాలంకృతం బై యొప్పు నప్పర్వతవతంసంబుం గనుంగొని పరమానందకందళితహృదయారవిందుం డై తదీయాధిత్యకారోహణం బొనర్చి యందు బహుసహస్రాదంభశుంభజ్జృంభన్మణిస్తంభసంభాసితంబును జాచత్కాంచనపాంచాలికాసంచయసమంచితంబును నభ్రంకషోత్తుంగశిఖరావలంబిశాతకుంభకుంభగుంభితంబును మనోహరహీరసోపానవితర్దికావిటంకకుట్టిమవిరాజమానంబును గనత్కనకకవాటార్గళద్వారబంధబంధురంబును నవరత్నఖచితోత్తాలసాలగోపురప్రాసాదమంటపప్రదీపితంబును బటుతత్వవిద్యాధురీణపరమభాగవతోత్తమనిపఠితవేదనాదమేదురంబును సురూపలావణ్యగణ్యపణ్యాంగనానృత్తగీతవాద్యధ్వానమానితంబును హనుమద్గరుడశేషవిష్వక్సేనజయవిజయద్వాదశసూరిజనాధిష్ఠితంబును గౌశికకాలాగరుకర్పూరసాంబ్రాణికాధూపవాసనావాసితంబును సద్యోఘృతకృతప్రదీపదీపితంబును బహుళాపూపసూపపరమాన్నఫలదధిమధుశర్కరాఘృతోపేతమహానైవేద్యహృద్యంబును నై రెండవవైకుంఠధామంబును బోలి విరాజిల్లు శ్రీమద్వరాహనృసింహదేవదేవాలయంబుఁ బొడఁగని నమస్కరించి యంతట గంగధారాదిచతుర్వింశతిధారానీరంబులఁ గృతావగాహుం డై తులాపురుషాదిమహాదానంబు లొనరించి గర్భాగారంబుఁ బ్రవేశించి. ౪

సీ. మేదినీతలగుప్తపాదద్వయమువాని
విమలసంస్తబ్ధకర్ణములవాని
నవిరళత్రివళిసమన్వితుం డగువానిఁ
గమనీయధవళవిగ్రహమువాని
విస్ఫుటపటుసటావిలసితుం డగువాని
దంష్ట్రాకరాళవక్త్రంబువాని
మృదులాంసభాగవిసృష్టవాలమువాని
నంచితనేత్రత్రయంబువాని
లాలితోత్తాలభుజయుగళంబువాని
సింహశైలేంద్రనిలయుఁడై చెలఁగువాని
శ్రీసమేతు వరాహనృసింహదేవుఁ
గాంచె నృపమౌళి కన్నులకరవు దీఱ.

గీ. అట్లు గన్గొని సాష్టాంగ మాచరించి
మాలతీతులసీమహామయసుమములఁ
బూజ గావించి గంధతాంబూలధూప
దీపనైవేద్యము లొసంగి ధృతి నుతించె.

• పూరుషహర్యక్ష సుధీ
వారావనదక్ష దిఃజవల్లభపక్షా
ఘోరారిదనుజశిక్షా
పారకృపావీక్ష సింహశైలాధ్యక్షా.

క. నిను సేవించిననరులకు
మునుకొని ఘనభోగభాగ్యములు చేకుఱుఁ బో
సనకాదిసకలసన్ముని
జనరక్షణరంహ సింహశైలనృసింహా.

